శ్రీ

గురుభ్యోన్నమః.

శ్రీమద్దేవాంగపురీ

# నాగలింగేశ్వరస్తవ

# నక్షత్రమాల.

ఇది

శ్రీదేవాంగకులోద్భవుండగు

కట్టా. అచ్చయ్యకవిచే

రచియింపబడి

బ్రహ్మశ్రీ. బండారు. ముత్యాలయ్యగారిచే

ప్రకటింపబడి

మ.రా. కొమూర్తి పుల్లయ్యగారి

స్వకీయ

ప్రకాశికా పరమేశ్వరీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను.

బాపట్ల. 1911

శ్రీ గురుభ్యోనమః

శ్రీమద్దేవాంగ పురీ

# నాగలింగేశ్వర స్తవ నక్షత్రమాల.

---

శా. శ్రీదాక్షాయణిహృత్పయోజ మధుపా
శీతాంశు వన్మౌళిభ
ర్గావంతావళ దైత్య భంజనహరా
గంగాజటాజూట శ
ర్వాదీనావన చిత్ప్రకాశ శుభదా
వందేవదామానిపా
హాదేవాంగ పురీనివేశ భవనా
శా నాగలింగేశ్వరా.

సీ. కిన్నరేశ్వరమిత్ర • గిరిసుతచారిత్ర
సూనసాయకదైత్య • స్తోత్రపాత్ర
యఖిలజీవాధార • యంచితగుణపూర
యంబుధితూణీర • యఘవిదూర
ఫాలనేత్రమహేశ • కాలకంధరయీశ
పాలితామర్త్యేశ • శూలపాణి
వైకుంఠనాయక • వైభవదాయక
కైలాసనాయక • కాలరుద్ర
గీ. వృషపతితురంగ పార్వతీ • హృదయసంగ
భూషితభుజంగ భసితాంగ • పూతవిభంగ
వసుధదేవాంగ పురవర • వాసయీశ
వరజనహృదబ్జసారంగ • నాగలింగ.

## నాగలింగేశ్వర స్తుతిమాల




సీ. మౌనీంద్రసందోహ • మానసవీథుల
వర్తించుపరతత్త్వ • మూర్తి వీవె
యఖిలభూతంబుల • కాధారభూతుండ
వయి వెలింగెడువిశ్వ • మయుఁడ వీవె
ప్రళయకాలమునందు • నుగ్రరుద్రుండవై
తేజరిల్లినగుణ • రాశి వీవె
యెందెందుఁజూచిన • నందందుశక్తితో
నిండియుండిన విభు • యుండవీవె

గీ. యంచు నుతియించె నెపుగాదె • యఖిలజనులు
నీమహత్త్వంబు బొగడంగ • నేర్తు రెట్లు ?
వసుధ దేవాంగ పురవర • వాసయోగి
నతజనహృదబ్జసారంగ • నాగలింగ.

## నాగలింగేశ్వర స్తవవతుత్రమాల.

సీ. నిరతసత్ఫలమిచ్చు • నిగమంబులెవ్వాని
విశ్వాసములెయన • నెగడుచుండె
నవన వాలంకృత • భువనంబదెవ్వాని
చిహ్నంబటంచను • జెప్పుచుండె
నానందకరుడైన • యమృతాంశుడెవ్వాని
హృదయమంచని జెప్పు • విజ్ఞానదసె
వనజాప్తుడైవట్టి • దిననాథుడెవ్వాని
చక్షురింద్రియమన • జనుమీర

గీ. నట్టిబ్రహ్మంబుపై వాయు • చభినుతింతు
సర్వకారణకారణ • శత్రుహరణ
వసుధ దేవాంగపురవర • వాసగామి
నతజనహృదబ్జవాసగ • నాగలింగ.

సీ. అర్ధనారీత్వమ్ము ♦ దలఁచియుంచుటచేత
పురుషుండవని నిన్నుఁ ♦ బోల్పలేను
గడ్డంబు గొప్పగాఁ ♦ గలిగియుండుటచేత
స్త్రీయని నిన్ను నే ♦ జెప్పలేను
పద్మశాలను నాఁటి ♦ పత్నివైయుంటచే
బాలుండవని నిన్ను ♦ బలుకలేను
గతజరామరణసం ♦ స్థితుఁడవైయుంటచే
వృద్ధుండవని నిన్ను ♦ బిలువలేను

గీ. అజుని గూల్చినపాతకి ♦ వనఁగలేను
నీచరిత్రంబు నాకెంతొ ♦ దోచదయ్యె
వసుధ దేవాంగ పురవర ♦ వాసయోగీశ
నతజనహృదబ్జసారంగ ♦ నాగలింగ.

# 6. నాగలింగేశ్వర స్తవనక్షత్రమాల.

సీ. నీయాజ్ఞచేఁగదా • నీరజోద్భవుఁడైన
జీవకోటులసృష్టి • జేయుచుండె
నీయాజ్ఞచేఁగదా • నీరజాధిపుఁడైన
ప్రాణికోటికినారో • గ్యమ్ముఁగనియె
నీయాజ్ఞచేఁగదా • నీరజాప్తుండైన
పరగనియమంబుగాఁ • దిరుగుచుండె
నీయాజ్ఞచేఁగదా • నీరజారాతియుఁ గ
పరగనోషధులఁగా • పాడుచుండె

గీ. నీయనుజ్ఞను మేఘుండు • నీరొసంగి
పైరులెల్లనుచక్కఁగాఁ • బండఁజేయు
వసుధ దేవాంగ పురవర • వాసయీశ
నతజనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. వేదశాస్త్రపురాణ•విద్యాప్రసంగులై
నెగడెడు పెద్దపం•డితులు నైన
సత్కావ్యనిర్మాణ•చాతుర్యముగల్గి
వరలుచుండెడుకవీ•శ్వరులు నైన
కిన్నరతుల్యులై•కీర్తనంబుల బాడి
యలరారుచుండు గా•యకులు నైన
ఘనతపోధ్యా•నమునుగాంచి యడవుల
దిరుగుచుండెడు మునీ•శ్వరులు నైన

గీ. నిన్నుధ్యానించిమదిలోన•నిలుపకున్న
ముక్తినేరీతిబొందగా•శక్తిగల్గు
వసుధ దేవాంగ పురవర•వాసయీశ
నతజనహృదబ్జసారంగ•నాగలింగ.

# నాగలింగేశ్వర స్తవనక్షత్రమాల.

క్రమముదప్పక యెత్రి • కాలంబులను వేద
పాఠంబొనర్చిన • ఫలముగాని
యనుపమమగు తీర్థ • యాత్రల భక్తితో
సలిపి పొందిన యట్టి • ఫలముగాని
దానధర్మంబులు • తగురీతి గావించి
వాసిచేకొన్నట్టి • ఫలముగాని
యెట్టి వేళలనైన • నెంతకష్టమునైన
పలికి బొంకని యట్టి • ఫలముగాని
నీయనుగ్రహ మొక్కింత • నాకడకున్న
గలుగ నేర్చునె జనులకు • కలుషమణగి
వసుధ దేవాంగపురవర • వాసయీశ
వనజభవహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. బ్రహ్మాండరూపనీ•పదయుగళంబుపై
స్థిరభక్తినిలపని•శిరమదేల
సకలాంతరాత్మనీ•స్మరణంబుమరువక
సేయుజాలనియట్టి•జిహ్వయేల
భువనరక్షణనీదు•పూజలునిత్యంబు
గరిమతోసలుపని•కరములేల
వేదాంతవేద్యనీ•విశ్రుతసత్కథల్
వినని కర్ణంబుల•విధమదేల

గీ. నిన్నుగనజాలకున్నట్టి•కన్నులేల
పరగ నీసేవసేయని•జన్మమేల
వసుధదేవాంగపురవర•వాసయీశ
నతజనహృదబ్జసారంగ•నాగలింగ.

౧. క్షీరాబ్ధినుదయంబు • జెందినగరళమున్
మిసిమిముద్దపిధంబు • మ్రింగెనెవడు
పురారాతిత్మకగుణగజా • సురునిచర్మంబును
కనకాంబరముగీతి • గప్పెనెవడు
పరిబలగర్వముగన్న • బ్రహ్మకపాలంబు
కుడలోపథరియించి • మెరసెనెవడు
నిఖిలభూతపిశాచ • నిలయమాస్మశా
డిల్లుగాగానివసి • యించెనెవడు
• భూతికాయంబునంతయు • బూసెనెవ్వ
డట్టినిన్నాదనమ్మితి • ననుదినంబు
వసుధదేవాంగపురవర • వాసయీశ
పతజనహృత్పద్మసారంగ • నాగలింగ.

సీ. నినుగోరినంత నే • నీయర్ధ దేహంబు
మెచ్చి కాత్యాయనికిచ్చినావు
నిను వేడినంత నే • నిలచి బాణుండను
కర్మకు ద్వారంబు • గాచినావు
నిను భాషించినంత నే • నియతిగ నసురు
పురరంబులో వాస • ముండినావు
నినుజేరినంత నే • విని రావణునకుబల్
చాన్రివాసము వేనా • సంగినావు
గీ. భళిర! నీ త్యాగమునుగూర్చి • వర్ణనంబు
సలుపశక్యంబె వేనోళ్ల • చిలువకైన
వసుధ దేవాంగపురవాస • వాసయీశ
నతజనహృద్బ్జపాంగ • నాగలింగ.

సీ. అలఘుభోగమునాగి • వలరుయాగామంబు
నలరింపగావన • తాగమంబు
హృదయానురాగమా • మదిమయూరాళికా
నందంబుజూప ఘ • నాఘనంబు
ఘనవైభవంబను • కల్పవల్లిని బెంప
లాలితంబైనట్టి • యాలవాల
మనుపమశుభకార్య • మనెడి పద్మాటవి
పల్లవింపగ జేయు • భవ్యహేళి

గీ. మానితంబగునీసేవ • మానవులకు
తాపహృతిలోల వ • స్వస్రపా
వసుధ దేవాంగపురవరా • వాసయీశ
నతజనహృదబ్జహారంగ • నాగలింగ.

సీ. ప్రబలాంతరంగశా◆త్రవదుష్కృతిధ్వాంత
మడఁగించుగాదెనీ◆యమలభక్తి
సతతముష్టధమున◆జనుమనోశ్వదవంబు
సమయించుగాదెనీ◆యమలభక్తి
సంచితచాంచల్య◆సంచేంద్రియస్పర్ధ
హరియించుగాదెనీ◆యమలభక్తి
ఈషణత్రితయము◆న్కర్మబంధములు
హరియించుగాదెనీ◆యమలభక్తి
గీ. అతులతేజంబొసంగునీ◆యమలభక్తి
గలుగ భక్తులుమోక్షంబు◆గాంచుటదె
వసుధదేవాగ్రపువర◆వాసయోశ
వతజనహృదబ్జసారంగ◆నాగలింగ.

సీ. పరసతీగమనమ్మ • బాతకంబుహరించు
కూటసాక్ష్యంబన్న • కొలనడంచు
యనృతవాక్యములన్ని • యఘముననుదెగటార్చు
వెలయాలిపొందను • కలుషమూర్చు
సురనుసేవించుటల • నరకంబుబరిమార్చు
మాంసభక్షణమన్న • హింస మాన్చు
పగటిసంగమమన్న • పాపంబుబోకార్చు
వేదవిక్రియమన్న • వ్యజనమడచు

గీ. భవ్యమానననీదగు • భక్తిమహిమ
మింకనెంతనివర్ణింతు • నింపుగను
వసుధదేవాంగపురవర • వాసగుణాళి
వరజనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. దారిద్ర్యమనునట్టి • దారువుఛేదింప
గండ్రగొడ్డలినీదు • కరుణగాదె
కష్టసంతతియను • కడలిఘూర్ణిలఁజేయ
బడబాగ్నితావక • భక్తిగాదె
సంకోచమనుకాల • సర్పంబుహరియింప
తార్క్ష్యాత్మ మనువునీ • తపముగాదె
సంతాపమనుసామ • జంబునుగూల్పంగ
హరిడింభకము భవ • చ్ఛక్తిగాదె
గీ. కల్మషంబనుశార్వరీ • గర్వమడప
సూర్యమండలమగునీ యు • దార్యవృత్తి
వసుధ దేవాంగపురవర • వాసయీశ
సతజనహృత్పద్మపారంగ • నాగలింగ

సీ. గగనమార్గమునందు • గల తారకాళిలో
నిందుండు మేటియై • యెసగురీతి
నుపవనంబులయందు • నుండు వృక్షాళిలో
కల్పకంబధికమై • గ్రాలునట్లు
భువనంబునందున • బొదలు శైలములందు
కనకాద్రిగొప్పయై • వనరుమాడ్కి
మహిమంబుగల్గిన • మంత్రజాలములందు
ఘనపంచాక్షరి శోభ • గొనినయట్లు

గీ. దైవములకెల్ల దైవమై • దనరితీవు
నిన్ను బొగడంగ నశమానె • నీలకంఠ
నమిత దేవాంగపురవర • వాసయీశ
నతజనహృదబ్జసారంగ • నాగలింగ

సీ. ధరలోనగల్గు క్షే • త్రములన్నిటికంటె
సిరిమించియుండు నీ • క్షేత్రమరయ
నరులలో సద్భక్త • సముదాయముచేత
సేవ్యమై యుండు నీ • క్షేత్రమరయ
కన్గొని సేవింప • గలిగించుమహిత ప్ర
సిద్ధియైయుండు నీ • క్షేత్రమరయ
నాచారవంతుల • కామోదనిలయమై
చెలువారుచుండు నీ • క్షేత్రమరయ
గీ. భక్తియుక్తిని గలిగించు • ఫలితమొసగు
క్షేమముదయింప జేయునీ • క్షేత్రమరయ
వసుధ దేవాంగపురవర • వాసయీశ
నతజనహృదబ్జసారంగ • నాగలింగ

సీ. కైవల్యమును గూర్చ • ఘంటాపథంబౌను
యురుకర్మబీజాళికూషరంబు
జ్ఞానోదయమునకు • దావకంబై యొప్పు
కల్మషంబులకెల్ల • కర్తరియును
శుభసూచకమ్ములకు • చోటుగా దవరారు
వివిధజన్మములకు • వీడుకోలు
విభవసంతానంబు • ప్రభవించు నిలయంబు
భువనరక్షకిమూల • కారణంబు
గీ. గాదె నీభక్తి భక్తవ • ర్గంబునకును
గాని నాకగూర్చగదవయ్య • దీనపోష
నమాధదేవాంగపురవర • వాసయోగి
నతజనహృదబ్జసారంగ • నాగలింగ

౭. అర్థహీనంబగు • వలశబ్దగరిమంబు
భర్తృహీనంబైన • భామబ్రదుకు
కర్మహీనంబైన • కాయుసౌష్ఠవమును
బలహీనమైన దే • శంబుసుఖము
తనయహీనంబైన • దాంపత్యకుతుకంబు
మంత్రిహీనంబైన • మహియశంబు
ధర్మహీనంబైన • యాగసంధ్యఫలమును
శుద్ధిహీనమైనట్టి • రూపకలిమి

గీ. నాదెనీకనుగుడి లేని • నామమవని
జెవసినిష్ఫలమని వేర • చెప్పవలెన
వసుధ దేవాంగపురవర • వాసయీశ
నతజనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. భవదంశ సంభూతి • బడసిన నేగదా?
యాంజనేయుం డను • బలాఢ్యుండయ్యె
భవదంశ సంభూతి • బడసిన నేగదా?
దారు కానన ఋషుల్ • ధన్యులైరి
భవదంశ సంభూతి • బడసిన నేగదా?
కాల భైరవుడు వి • ఖ్యాతుండయ్యె
భవదంశ సంభూతి • బడసిన నేగదా?
నరగ పశ్వద్ధామ • జయము గాంచె
గీ. యట్టి భవదంశ సంభూతి • బడయు కతన
చెలగి వీరలు చిరకాల • జీవులైరి
వసుధ దేవాంగపుర వర • వాసయీశ.
నతజన వ్రాత సన్నార • నాగలింగ.

సీ. అణువున్ననుమహా • యద్రిరాజమునైన
సమముగాపాలన • సలిపెదీవు
దోమనైనను మత్త • సామజపతినైన
సమముగాపాలన • సలిపెదీవు
పల్వలంబులనైన • వార్ధులనైనను
సమముగాపాలన • సలిపెదీవు
సామాన్యునైనను • సార్వభౌమునినైన
సమముగాపాలన • సలిపెదీవు
గీ. పక్షపాతంబునింత గ • న్పడదీవు
కలనన్యాయంబు నీయందు • కలదుకలదు
వసుధ దేవాంగపురవర • వాసయోగి
పతితపావనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. ఎవ్వానికరుణచే • నెలమి మార్కండేయు
డిలను దీర్ఘాయుడై • యుంపుగాంచె
నెవ్వానికృపచేత • వినసిసానంబందు
ప్రబలవైరాగ్యంబు • బడసిమించె
నెవ్వానిదయచేత • నిందిరానందనుడైన
పార్థుండు వరపాశు • పతముగాంచె
నెవ్వానియనుకంప • మెసగశ్రీయాళుండు
కైలాసవిభవంబు • గాంచియలరె

గీ. యెవ్వనికటాక్షవిభవంబు • నివ్వటిలగ
విశ్వజాలంబువృద్ధిగా • వెలయునట్టి
వసుధ దేవాంగపురవర • వాసయీశ
భక్తజనహృదబ్జసార • నాగలింగ

సీ. వీరేశ్వరాయంచు • వినుతింతునిత్యంబు
దారుకేశ్వరయంచు • దలంతుమదిని
సంగమేశ్వరయంచు • స్తవమునుగావింతు
నిందేశ్వరాయంచు • నెంతులోన
జానేశ్వరాయంచు • ధ్యానంబుగావింతు
భీమేశ్వరాయంచు • బిలుతునిన్ను
దత్తేశ్వరాయంచు • బత్తి నిపలిపెద
ధర్మేశ్వరాయంచు • దాల్తునెదను

గీ. పార్వతీశ్వరయనిపాట • పాడుకొందు
నీదుకృపజూపియోపింగ • రాదెనన్ను
వసుధ దేవాంగపురవర • వాసయోశ
నతజనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. మంగళంబిదెనీకు • మహిమామృతానంద
మంగళంబఖిలేశ • మంగళంబు
మంగళంబిదెనీకు • మానితగంభీర
మంగళంబుమహేశ • మంగళంబు
మంగళంబిదెనీకు • మానాధసేవిత
మంగళంబుపరేశ • మంగళంబు
మంగళంబిదెనీకు • మహితతేజోరాశి
మంగళంబుగిరీశ • మంగళంబు

గీ. మధురవాగ్జాలనీదే • మంగళంబు
లింగమంగళమిదెనీకు • మంగళంబు
వసుధదేవాంగపురవర • వాసయోగి
వణిజనహృదబ్జసారంగ • నాగలింగ.

సమాప్తము.

